# బిల్లీ గ్రేహమ్ జీవిత చరిత్ర

డా॥ బిల్లీ గ్రేహమ్‌గారు ప్రపంచంలో గొప్ప సువార్తికునిగా గుర్తింపు పొందిన వ్యక్తి. ఇతడు 50 సంవత్సరాల పాటు ఆరు ఖండాలలోని 85 దేశాలలో 10 కోట్ల మందికి పైగా క్రీస్తు సువార్తను ప్రకటించారు. క్రీస్తు సువార్తను అంత గొప్పగా ప్రపంచ దేశాలలో ప్రకటించిన వ్యక్తి మరొకరులేరు. ఇతడు కోట్లాది మంది సామాన్య ప్రజలకు మాత్రమే కాక అనేక దేశాలలోని దేశాధినేతలకు సహితం క్రీస్తు సువార్తను ప్రకటించి, 20వ శతాబ్దపు గొప్ప సువార్త విప్లవానికి నాంది పలికారు.

అప్పుడప్పుడే కనుగొనబడిన ప్రచార సాధనాల ద్వారా సువార్త ప్రచారానికి సుభప్రదమైన ప్రారంభాన్ని ఇచ్చారు. బిల్లీ గ్రేహమ్, రేడియో, టెలివిజన్, సాటిలైట్ మొదలగు ప్రచార సాధనాల ద్వారా కోట్లాది మంది ప్రజలను ప్రభావితం చేసి వారిని ప్రభువు, వద్దకు నడిపించినవారిలో ప్రధముడు బిల్లీ గ్రేహమ్.

అతి సామాన్య కుటుంబంలో జన్మించిన బిల్లీ గ్రేహమ్ బాలుడిగా హైస్కులు విధ్యాభ్యాసం చేసే సమయంలోనే ప్రభువైన యేసుక్రీస్తును తన స్వరక్షకునిగా స్వీకరించారు. తనలో పొంగి పొర్లుతున్న రక్షణానందాన్ని తనలోనె అణచుకోలేకపోయిన బిల్లీ గ్రేహమ్ తన భాల్యం నుండే రక్షణ వార్తను ప్రకటించడం ప్రారంభించాడు. అనతి కాలంలోనే తన

పరిచర్య ఫలాలను కళ్ళారా చూడగలిగాడు.

సువార్త పరిచర్యలో బిల్లీ గ్రేహమ్ అనుభవాలు ఈనాటి విశ్వాసులకు అత్యంత ప్రోత్సహాకరమైనవి మాత్రమే గాక, అవి వారికి "సర్వలోకమునకు వెళ్ళి సర్వసృష్టికీ సువార్తను ప్రకటించుడి" అన్న తమ ప్రభుమాటల్ని జ్ఞాపకం చేసి సువార్త పరిచర్యలో జయకరంగా ముందుకు సాగేందుకు వారికి మార్గదర్శకాలుగా ఉంటాయి.

## జననము మరియు బాల్యము

అమెరికా దేశమందున్న ఉత్తర కరోలీనా దేశమందు చార్లెట్టే అనునది ఒక చిన్న పట్టణం అచ్చట తన యథార్థమైన వ్యాపార సామర్థ్యం గల విలియమ్ ఫ్రాంక్లీన్ గ్రేహమ్ ఉండేవారు. ఆయనకు 200 ఎకరాలు గల ఫారము ఉండేది. ఆయన భార్య పేరు మరో గ్రేహమ్. వీరు దైవ భక్తి గలవారు. వీరికి పెద్ద కుమారునిగా బిల్లీ గ్రేహమ్ 1918 సం॥లో నవంబరు 7వ తేదీన జన్మించాడు. బిల్లీ గ్రేహమ్ తన చిన్న తనం నుండి తుంటరి పనులు చేస్తూ వచ్చాడు. కొన్ని క్లిష్ట పరిస్థితులలో అమెరికా ఆర్థికంగా చితికిపోయినది. అయినప్పటికీ బిల్లీ ఎటువంటి చింత లేకుండా ఎదుగుతూ వచ్చాడు. ఫారమ్ పనులతో చిన్నప్పటి నుండీ ఆశక్తిగా పాల్గొనెను. త్వరలోనే ఆ ప్రాంతమందు ఎంతో వేగముగాను నైపుణ్యంతో పాలు పిండువాడు అనే పేరు పొందెను తన చెల్లెలు కేథరిన్ జుట్టు పట్టుకొని లాగుట ఎగతాళి

చేయుటను బట్టి తన తల్లిదండ్రుల చేత అనేకసార్లు శిక్షింపబడెను. బిల్లీ తల్లితండ్రులకు ఎంతో విధేయత చూపేవాడు. బిల్లీ తల్లితండ్రులు చిన్న తనం నుండి బైబిలు చదువుటను, ప్రార్థించుటను, సండే స్కూల్‌కు వెళ్ళుట క్రమంగా అలవాటు చేసిరి. హైస్కూల్ చదువుచుండగానే బిల్లీ బేస్ బాల్ ఆటలో ఆసక్తి చూపెను. 16 సం॥ వయసులోనే బేస్ బాల్ ఆటలో శ్రేష్ఠుడని పేరు పొందెను. చిన్నప్రాయం నుండి పుస్తకాలు చదువుటయందు ఎంతో ఆసక్తి కలిగియుండెను. 14 సం॥ పూర్తి కాకమునుపే వంద కంటే ఎక్కువ పుస్తకములను (చరిత్రలను) చదివియుండెను.

బిల్లీ దేవుని సేవ చేయటం కోసం తన తల్లి బిల్లీ చిన్నతనం నుండే ప్రార్ధన చేస్తూ వచ్చేది. అనేకసార్లు బిల్లీ కారును తీసుకొని వేగముగా నడుపుతూ తిరుగుట బిల్లీ యొక్క అలవాటు. ఒకసారి కారు నడుపుతూ బురదలో మునిగిపోయెను. బిల్లీ తల్లిదండ్రులు గుర్రములకు కారును కట్టి బయటకు తీయుటకు ఎంతో ప్రయాసపడిరి. బిల్లీ భాధ్యతలేనివానిగా తిరుగుచున్నందున, తన కుమారుని కొరకు తల్లి ఎంతో చింతించెను.

బిల్లీ చాలాసార్లు తమ పొలాల మధ్యనున్న తమ పశువులను మేపేవాడు. ఆవులతో స్నేహంగా ఉండేవాడు, వాటికి కూడా బిల్లీ అంటే చాలా ఇష్టం. ఒకసారి ఆవు బిల్లీ కాలు తొక్కింది ఆ భాదలో పాలు చకచకా

పిండేసాడు. కోళ్ళకు, మేకలకు మేత వేసేవాడు.

బిల్లీ తల్లి ప్రతిదానికి దేవుని మీద ఆధారపడడం నేర్పింది. (సామెతలు 3:5,6 నీ స్వబుద్ధిని ఆధారము చేసికొనక నీ పూర్ణహృదయముతో యెహోవాయందు నమ్మిక యుంచుము.)

బిల్లీ గ్రేహమ్‌కు 15సం॥ వయసు ఉన్నప్పుడు తన తండ్రి ఫ్రాంక్లిన్ గ్రేహమ్‌కు ఆనారోగ్యం కలిగింది. ఆయన భార్య (బిల్లి గ్రేహం తల్లి) మరో గ్రేహం ఎడతెగని ప్రార్థన వలన సంపూర్ణ స్వస్థత లభించెను. అప్పటినుండి బిల్లీ గ్రేహమ్‌కు బైబిల్ చదువుటకును, ప్రార్థించుటకునూ ఎక్కువ సమయం కేటాయించెను. 1935వ సం॥లో వేసవికాలంలో మొర్దకైహమ్" అనే బోధకుడు తన పట్టణమైన బార్లెట్టీ వస్తున్నాడని తెలిసినప్పుడు బిల్లీ అంత ఉత్సాహం ప్రదర్శించలేదు. తన తోటివారు మాత్రం ఎంతో సంతోషపడ్డారు ఆ సేవకుడు వస్తుందన్నందుకు, వేసవి సెలవలు కాబట్టి పొలంలో పనిచేయాలి. బేస్ బాల్ ఆడాలి, నాకు సమయం ఎక్కడిది. కూడికలకు హాజరు అవడానికి అని మనసులో అనుకున్నాడు. బిల్లీ తండ్రి ఆ ప్రసంగీకుని గురించి గొప్పగా చెప్పాడు. ఆ ప్రసంగీకుడు కూడా చాలా గొప్పగా భోదిస్తాడు. అయినా బిల్లీ ఆ కూటాల్లో పాల్గొనలేదు. ఆ కూటములు 11 వారాలు జరిపిరి. బిల్లీ స్నేహితుడు ఆల్బర్ట్ ఒక ఉపాయం చెప్పెను. బిల్లీని కారు నిండా

యవ్వనస్తులను కూటములకు నడిపించవలసిందిగా కోరెను. కారు నడుపుటలో ఆశక్తి గల బిల్లీ కారు నడుపుతూ వెళ్ళెను. బిల్లీ ఆ కూటమి యొక్క చివరి వరుసలో కూర్చుండెను. మొర్దెకై ప్రసంగం అతనిని ఆకర్షించెను. అతని హృదయంలో పోరాటము బయలుదేరెను. రాత్రివేళ తన గదిలో నెమ్మది లేనివాడై అల్లాడుచుండెను. అతని మనసులో పోరాటమును గ్రహించెను. ఆల్‌బర్ట్ అతని కొరకు ప్రార్థించుచూ వచ్చెను.

మరునటి దినము బిల్లీ తానే కూటములకు వచ్చి పాల్గొనెను. గ్రాడీ విల్సన్ అనే స్నేహితుడు అతనితో వచ్చి యుండెను. మొర్దెకై గారికి మాట్లాడునప్పుడు వేలు చూపించి మాట్లాడుట అలవాటు. బిల్లికి ఆయన తనవైపే వేలు చూపించుచున్నాడనే భయం కలిగెను. ముందు వరుసలోనున్న ఒక స్త్రీ టోపీ వెనుక దాగుకొనెను. కొన్ని దినముల తరువాత బయమును జయించిన బిల్లీ మొదటి వరుసలో కూర్చోని ఆసక్తిగా సువార్తను వినసాగెను. మొర్దెకై గారు గట్టిగా మాట్లాడుతూ దేవుని వాక్యాన్ని భోదిస్తున్నారు. "నీవు పాపివి...! హేయ్ అరిచారు. అతడు ఆ మాటను బిల్లీ వైపు తన వేలు చూపిస్తు అన్నాడు. "నేనా..?" బిల్లి బెదిరిపోయి అన్నాడు. తన కూర్చిలోనే కుప్పకూలిపోయాడు. డా. హామ్‌కు తన గురించి ఎలా తెలుసు? తనేం తప్పు చేసాను? ఆ సాయంత్రం కూడిక ముగిసేసరికి బిల్లీ

కదిలిపోయాడు. తను నిజంగానే ఒక పాపినని బిల్లీ తలంచాడు. బిల్లీ తన తప్పు తెలుసుకున్నాడు. తన పాపాలను దేవుని యెదుట ఒప్పుకున్నాడు. మొర్దెకైహమ్‌గారు యేసును రక్షకునిగా అంగీకరించగోరు ముందుకు రావలసిందిగా మనవి చేసెను. గాయకుల బృందము **"నేను పాపిని"** అను పాటను పాడుచుండిరి. బిల్లీ మనసులోని పోరాటము తుదకు జయము నొందెను. ముందుకు వెళ్ళి తనను దేవుని చేతికి అప్పగించుకొనెను. అతని స్నేహితుడగు గ్లాడీ విల్సన్ కూడా పశ్చాత్తాప పడి యేసును తన సొంత రక్షకునిగా అంగీకరించెను. ఆ రాత్రి బిల్లి తన తల్లిదండ్రులతో **"నేను మార్పు నొందాను"** అని చెప్పాడు. తన తల్లిదండ్రుల సంతోషానికి హద్దులు లేవు. అతని తండ్రి అతనిని కౌగలించుకొని ముద్దు పెట్టెను. బిల్లీ జీవితము నూతన రూపము దాల్చెను. బైబిలుగ్రంథమునందు మరింత ఆసక్తి చూపెను. దూకుడు తన ముతుంటరి పనులను పూర్తిగా విడిచిపెట్టెను. తన తల్లి తన ప్రార్థన ఆలకించబడినందుకై దేవుని స్తుతించెను.

## మొట్ట మొదట సాక్ష్యమిచ్చుట

బిల్లీ జమ్మి జాన్సన్ అను ప్రసంగీకునితో ఆండ్రో జైలులోని ఖైదీలను చూడ వెళ్ళెను. ప్రసంగించుచూ ఉండిన జాన్సన్ హఠాత్తుగా బిల్లీను సాక్ష్యం చెప్పవలసిందిగా కోరెను. ఉలిక్కిపడిన బిల్లి తడబడుతూ కొన్ని

మాటలతో తాను రక్షింపబడిన సంఘటనను చెప్పి ముగించెను. బిల్లీ చెప్పిన మొట్టమొదట సాక్ష్యం చెప్పిన సందర్భం ఇది. సండే స్కూలులో సాక్ష్యం చెప్పుచుండగనూ తడబడు చుండెను. తనతండ్రి అతడు బైబిలు శిక్షణ పొందవలెనని జిబ్ జోన్స్ బైబిల్ కళాశాలలో చేర్పించెను. డా॥ జాబ్‌జోన్స్ ప్రసంగములు బిల్లీ మనసును ఆకర్షించెను, అయితే కొన్ని పద్ధతులు ఆ కాలేజీ క్రమశిక్షణ బిల్లీకి నచ్చలేదు. క్రిస్మస్ సెలవులకు ఇంటికి వచ్చిన బిల్లీకి, ఫ్లూ జ్వరం వచ్చింది. స్వస్థత పొందిన తరువాత బిల్లీ మళ్ళీ జాబ్‌జోన్స్ కళాశాలకు వెళ్ళలేదు. తరువాత ఫ్లోరిడా బైబిల్ కళాశాలలో చేరెను. ఆ కళాశాలలో క్రమశిక్షణ బాగా నచ్చెను. ఈ కళాశాలలో 3.1/2 సం॥లో విద్యభ్యాసం పూర్తిచేసెను. ప్రసంగములను తయారుచేసుకొని విద్యార్థుల మధ్య మాట్లాడుట ద్వారా తన పిరికితనమును తొలగించుటకు ప్రయత్నించెను. రాత్రి వేళ దగ్గరనున్న అడవికి వెళ్ళి బిగ్గరగా మాట్లాడుతూ తర్ఫీదు పొందెను. బైబిలు కళాశాలలో చదువుతున్నప్పుడు తన ఫీజు కోసం ఖాళీ సమయాలలో బ్రష్‌లను అమ్మేవాడు. ఆ వేసవికాలమంతా బ్రష్‌లను అమ్ముతూ సువార్తను ప్రకటిస్తూ గడిపాడు.

## బిల్లీచేసిన మొదటి ప్రసంగం

30 మంది సమావేశమై ఉండిన ఆలయమందు మాట్లాడుటకు లేచెను. అయితే అతడు సిద్ధము చేసి ఉంచిన 4 ప్రసంగములు సహాయ పడలేదు. ఆయనకు మాట్లాడ

సామర్ధ్యము మంచిగా ఉండేను. 4 ప్రసంగములు బిల్లి కేవలం 8నిమిషల్లో మాట్లాడి ముగించెను. మరి ఒకసారి బిల్లీకి ఏమి మాట్లాడాలో తోచలేదు. తన రూమ్‌మేట్ అయిన ఉడ్రోబెలిన్ సిద్ధపరచి యుంచెన నోట్స్‌ను తీసుకొని ప్రసంగించెను. తడబడుట చాలామట్టుకు తగ్గిపోయెను. వినినవారి నుండి అభినందనలను పొందెను. వారి ప్రోత్సాహ మును బట్టి బిల్లీకి ఆసక్తి పెరిగేను. 1937 సం॥ చివరి నాటికి బిడియము లేకుండా ప్రసంగించు సామర్ధ్యమును సంపాదించు కొనను.

## సంపూర్ణ సేవ

1938వ సం॥ మార్చి నెలలో గోల్ఫ్ గ్రౌండ్‌లో ఇటు అటు తిరిగుచుండెను. వెన్నెల కాంతితో ప్రకాశమైయుండెను. ప్రకృతి యొక్క ప్రసాంతతలో తన హృదయమందు నూతన భావము కలుగుట బిల్లీ గ్రహించెను. తక్షణం మొకరించి ప్రార్ధించగా ప్రభువు పిలుపు అతనికి అర్ధమాయెను.

**"దేవా నేను ఒక ప్రసంగీకునిగా మారాలని మీరు కోరినయెడల నన్ను నేను సంపూర్ణముగా సమర్పించుకొనుచున్నాను అని ప్రార్ధించి దేవుని పిలుపును అంగీకరించెను. ఆ సమయమందు లక్షలాది ప్రజలయెదుట తను ప్రసంగించినటువంటి దర్శనములను చూచెను."** అప్పటి నుండి బిల్లీకి ప్రసంగములలో నూతన శక్తి కనబడెను. బిగ్గరగాను ఎంతో వేగముగానూ ఆయన ప్రసంగించుట త్రాగుబోతులు, ఖైదీలను

ఎంతో ఆకర్షించెను. దానివల్ల గొప్ప ఫలితము లభించెను. సువార్త ప్రకటించు దినములలో ఎక్కువ శాతం ప్రార్ధనలో గడుపుట వలన స్టేజ్ మీదకు ఎక్కినప్పుడు నీరసంగా ఉండేవాడు. అయినను ఎక్కువ సమయం ప్రార్థనలో గడుపుట ఆయన విడిచిపెట్టలేదు.

## వివాహము

జానిస్ట్రీటర్, రూల్‌బెల్‌ను బిల్లీ గ్రాహంకు పరిచయం చేసాడు. ఆమె డిగ్రీ 2వ సంవత్సరం చదువుతుంది. ఆమె తల్లిదండ్రులు చైనాలో మిషనరీలుగా పని చేస్తున్నారు. ఆమె బిల్లీకి బాగా నచ్చింది. బిల్లీ ఆమెను ప్రేమించ సాగాడు. ఇద్దరూ తరచుగా సంభాషించుకునేవారు. నేను రూత్‌తో జత పరచడం దేవుని చిత్తమైతే వివాహము దేవుడే జరిపిస్తాడు అని బిల్లీ తన మనసులో అనుకున్నాడు.

చాలా సమయం ప్రార్ధనలో గడిపిన తరువాత రూత్ బిల్లీ తీర్మానం పూర్ణ మనస్సుతో అంగీకరించెను. 1943వ సం॥లో బిల్లీ గ్రేహమ్ చదువు ముగించుకొని డిగ్రీ పొందెను. రూతును కలుసుకున్న 3సం॥ల తరువాత బిల్లీ ఆమెను వివాహము చేసుకున్నాడు. వీరి వివాహము 1943 ఆగష్టు 13వ తేదీన ఉత్తర కెరోలీనా మాన్‌ట్రీట్‌లో జరిగింది. ఆ వివాహాన్ని ఫ్లోరిడా బైబిల్ పాఠశాలలో బిల్లికి ఆత్మీయ ఉపదేశకుడైన జాన్ మైండర్ జరిపించారు. తన బంగారు వివాహపు ఉంగరాన్ని తాను ఒక్కక్షణం కూడా తీయబోనని బిల్లీతో రూత్ చెప్పింది. వివాహ

అనంతరం సేవలో ముందుకు వెళ్ళారు. వివాహం అనంతరం ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు జన్మించారు. "పిల్లలు పెరిగి పెద్దవుతున్న సమయంలో వారి ఎడబాటుచే అమితంగా బాధపడ్డా క్రీస్తును ప్రకటించి తన జీవితగమ్యంలో ముందుకు సాగిపోయాడు బిల్లీ. పిల్లల ఆలనా పాలనా చూడడం, వారి సంతోషంలో పాలుపంచుకోవడం, వారు చెప్పే ఆసక్తి కరమైన విషయాలను ఆలకించి ఆనందించడం, వారు అడిగే ఆసక్తి కరమైన ప్రశ్నలకు జవాబు చెప్పి సంతృప్తి చెందడం, వారి నిరాశలో, దుఃఖంలో వారి కన్నీళ్ళు తుడిచి ప్రోత్సాహించడం వీటన్నిటినీ క్రీస్తు కోసం కోల్పోయాడు బిల్లీ అని తన భార్య సాక్ష్యం చెప్పింది. బిలీగ్రేహమ్ ఒక సేవకునిగా సేవ చేస్తూ, రేడియో స్పీకర్‌గా దేవుని వాక్యాన్ని అందిస్తున్నారు. "**క్రీస్తు కొరకు యువత**" అనే సంస్థను ప్రారంభించి యువతీ యువకులను క్రీస్తువైపుకు నడిపించారు. తన 27 సం|| వయస్సులో వెళ్ళి సంఘాలలో బోధించడం మానేసి వీధులలోను, భహిరంగ స్థలాలలో సువార్త సేవ చేయుటకొరకు "**యూత్ ఫర్ క్రైస్ట్**" ను ప్రారంభించారు.

**బలముగా వ్యాపించిన సేవ**

1949వ సం||లో లాస్ ఏంజిల్స్ పట్టణం మరియు దాని పరిసర పట్టణ ప్రాంతములలోని 100 సంఘములు పాల్గొనినవి. ఈ సభ ఒక గుడారములోనే

జరిగేను. 3,50,000 మంది ఈ కూటములకు హాజరైరి. దాదాపు 3000 మంది మారుమనస్సు పొందిరి. లాస్ ఏంజిల్స్ పేరు గాంచిన సినిమా పట్టణం. మాయా లోకమగు సినిమాశాఖలో నిమగ్నమైయున్న చాలామంది మారు మనస్సుపొందిరి. తాగుబోతులు, వ్యభిచారులు ప్రభువు అనుగ్రహించి పాప క్షమాపణను పొందిరి. 1950వ సం॥లో జనవరి నెలలో చాష్టన్ పట్టణం ముందు జరిగెను. ఈ కూటములకు దాదాపు 16000 మంది హజరు అయ్యిరి. 1000 మందికి పైగా మారుమనస్సు పొందిరి. 1954వ సం॥లో లండన్ క్రూసేడ్‌లో అనేక వేల మంది పాల్గొనిరి. 10 వేల మంది రక్షణ పొందిరి. అమెరికా దేశం 1953వ సం॥లో నూతన జీవం పొందుకుంది. మధ్యపానీయాల అమ్మకం 90శాతం తగ్గింది. విడాకులు అసలు లేకపోయెను. విడిపోయిన కుటుంబాలు ఏకమాయెను. బైబిలు గ్రంథముల అమ్మకము 3 రెట్లు పెరిగెను. అమెరికా దేశమంతా ఉజ్జీవం కనబడెను. విస్తారమైన భాదలు కలవారు. చింతలు లేనివారై ఆసక్తిగా సంఘారాధనలో పాల్గొనిరి. 1955వ సం॥లో స్కాట్ ల్యాండ్ దేశమునందు ఉజ్జీవ కూటములు జరిగినవి. ఇవి మార్చి, ఏప్రిల్‌లలో జరిగినవి.

## భారతదేశమునకు బిల్లీ గ్రాహం

1956వ సం॥ జనవరి నెలలో బిల్లి గ్రేహమ్ చెన్నై, ముంబాయి, ఢిల్లీ, కొట్టాయం అనే పట్టణములలో ఉజ్జీవ కూటములు

జరిగేను. 3,50,000 మంది ఈ కూటములకు హాజరైరి. దాదాపు 3000 మంది మారుమనస్సు పొందిరి. లాస్ ఏంజిల్స్ పేరు గాంచిన సినిమా పట్టణం. మాయా లోకమగు సినిమాశాఖలో నిమగ్నమైయున్న చాలామంది మారు మనస్సుపొందిరి. తాగుబోతులు, వ్యభిచారులు ప్రభువు అనుగ్రహించి పాప క్షమాపణను పొందిరి. 1950వ సం॥లో జనవరి నెలలో చాష్టన్ పట్టణం ముందు జరిగెను. ఈ కూటములకు దాదాపు 16000 మంది హజరు అయ్యిరి. 1000 మందికి పైగా మారుమనస్సు పొందిరి. 1954వ సం॥లో లండన్ క్రూసేడ్‌లో అనేక వేల మంది పాల్గొనిరి. 10 వేల మంది రక్షణ పొందిరి. అమెరికా దేశం 1953వ సం॥లో నూతన జీవం పొందుకుంది. మధ్యపానీయాల అమ్మకం 90శాతం తగ్గింది. విడాకులు అసలు లేకపోయెను. విడిపోయిన కుటుంబాలు ఏకమాయెను. బైబిలు గ్రంథముల అమ్మకము 3 రెట్లు పెరిగెను. అమెరికా దేశమంతా ఉజ్జీవం కనబడెను. విస్తారమైన భాదలు కలవారు. చింతలు లేనివారై ఆసక్తిగా సంఘారాధనలో పాల్గొనిరి. 1955వ సం॥లో స్కాట్ ల్యాండ్ దేశమునందు ఉజ్జీవ కూటములు జరిగినవి. ఇవి మార్చి, ఏప్రిల్‌లలో జరిగినవి.

## భారతదేశమునకు బిల్లీ గ్రాహం

1956వ సం॥ జనవరి నెలలో బిల్లి గ్రేహమ్ చెన్నై, ముంబాయి, ఢిల్లీ, కొట్టాయం అనే పట్టణములలో ఉజ్జీవ కూటములు

జరిపించారు. కొన్ని కారణాల వల్ల ముంబాయి నందు బహిరంగ కూటములు జరపలేకపోయిరి. కేవలం సేవకులకు శిక్షణ ఇచ్చుటకు మాత్రమే కూటములు జరిగినవి. చెన్నై పట్టణమునందు తెలుగు, తమిళం భాషలలో తర్జుమా చేయబడింది. అనేకమంది కదిలింపబడ్డారు. 1956 భారత్ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ స్వయంగా వచ్చి కలుసుకున్నారు. 1957వ సం॥లో న్యూయార్క్ ఉజ్జీవ కూటమి జరిగింది. ఈ ఉజ్జీవ కూటమునకు 23,97,000 మంది హాజరైరి, 61,142 మంది మారుమనస్సు పొందిరి. 1959వ సం॥ నందు ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్ పట్టణమునందు ఉజ్జీవ కూటములు జరిగినవి. లక్షలాది మంది సువార్తను విని

మారుమనస్సు పొందిరి. మత్తుపానీయాలు సేవించుట, జూదము వంటి వ్యసనములలో చిక్కుకొని ఉన్న అనేకులు ప్రభువు తట్టు తిరిగిరి. 1960వ సం॥లో ఆఫ్రీకా దేశంలో ఉజ్జీవ కూటములు జరిగినవి. నల్ల జాతి ప్రజలు అనేకులు వారు చేస్తున్న పాప పనులను బట్టి పశ్చాత్తాపపడిరి. 1961వ సం॥లో ఫిలదెల్ఫియాలో ఉజ్జీవ కూటములు జరిగాయి. ఆ ఉజ్జీవ కూటములలో విద్యార్థి విద్యార్థినులకు శిక్షణ ఇచ్చిరి. 1963వ సం॥లో మరలా లాస్‌ఏంజిల్స్ పట్టణంలో ఉజ్జీవ కూటములు జరిపిరి. 1962వ సం॥లో చికాగోలో క్రుసేడ్ జరిపిరి.

## ప్రపంచ ప్రదర్శన

1964వ సం॥లో ఏప్రిల్ నెలలో న్యూయార్క్‌లో బిల్లీ గ్రేహామ్ స్టేడియం ఏర్పరచబడింది. **"మేన్ ఇన్ ఫిఫ్త్ డైమెన్షన్"** అను సినిమా చూపింపబడెను. దాదాపు 26 నెలలు ఈ ప్రదర్శన కొనసాగించబడినది. 125 దేశాలకు చెందిన 50 లక్షల మంది ఈ స్టేడియంను చూడ వచ్చిరి. 10 లక్షల మంది సినిమాను చూసి రక్షణ పొందిరి. 1965, నుండి1980 వరకు అనేక దేశాలలో ఉజ్జీవ కూటములు జరిగినవి. అనేక లక్షలమంది పాల్గొన్నారు.

## రెండోసారి భారతదేశమందు ఉజ్జీవ కూటములు

1977 నవంబరు నెల 29 నుండి డిసెంబరు 11 వరకు కలకత్తా, చెన్నై, హైదరాబాదు వంటి పట్టణాలలో ఈ కూటములు జరిగెను. ఈ కూటములలో 6,76,000 మంది, సువార్త వినిరి. 13,291 మంది మారుమనస్సు పొందిరి. ఆంధ్ర రాష్ట్రంలో (ఆంధ్ర తెలంగాణ కలిపి) అప్పట్లో తుఫాను భాదితుల సహాయార్ధమై ప్రార్థించి 23,800 డాలర్లు సహాయం చేసెను. 1977లో దివిసీమ ఉప్పెనకు చినగింజాము దగ్గరగల గణపేశ్వరము హరిజన కాలనీ తుడిచిపెట్టుకొనిపోగా బిల్లీ గ్రేహమ్ గారు 285

గృహాలను నిర్మించి ఇచ్చిరి. దానికి కృతజ్ఞతగా వారు తమ ఊరికి **"బిల్లిగ్రేహమ్‌నగర్"** అని పేరు పెట్టుకొనిరి.

## రచయితగా

బిల్లీ మొట్టమొదటిగా Peace with God దేవునితో సమాధానం అనే పుస్తకాన్ని రచించారు. అనేక లక్షల మంది ఆ పుస్తకం ద్వారా ఆత్మీయ మేలులు పొందారు. రెండో పుస్తకం (Secrets of Happines) ఆనందానికి రహస్యాలు. ఇది 1950లో ప్రచురింపబడెను. 1965లో (World Flome) మండుచున్న లోకము. బిల్లీ గ్రేహమ్ గారు రచయితల శిక్షణ శిబిరము 1963లో స్థాపించిరి. ఇక్కడ యవ్వన రచయితలకు శిక్షణ ఇవ్వబడుతుంది. 1975వ సం॥లో Angles gods secret Agents అనే పుస్తకాన్ని రచించారు. 1977వ సం॥లో How to be a born again తిరిగి జన్మించుట ఏలాగు అనే పుస్తకాన్ని రచించారు. దీని ద్వారా ఎంతో మంది ఆత్మీయ మేలులు పొందిరి. సువార్తికుల శిక్షణా కేంద్రమును స్థాపించిరి.

బిల్లీ గ్రేహమ్ గారి పనిలో చురుకుదనము కనీసం రెండు వారాలు కూడా విశ్రాంతి తీసుకోలేదు. ప్రతి పనిలో నూతన ఆసక్తి చూపుతారు. ఎవరైన కలుసుకొనుటకు వచ్చిన యెడల వారికి సువార్త ప్రకటింపక విడిచిపెట్టరు.

## పరిచర్య యొక్క రహస్యము

మీ పరిచర్య యొక్క రహస్య మేమని

అనేకులు అడిగితే 3 విషయాలు చెప్పారు.

**1.** ప్రార్థన, **2.** ప్రార్థన, **3.** ప్రార్థన అన్నారు. కష్టకాలములలో దేవున్ని ప్రార్థించు అభివృద్ధి కలిగినప్పుడు ప్రార్థించు ఆపదలో ప్రార్థించు ఆపదలో ప్రార్థించు ఆపదలేనప్పుడు ప్రార్థించమని అన్నారు.

